# పొడుపు కథలు

## పొడుపు కథలు - లక్షణాలు

వీటిని సృష్టించినవారు ఎవరో చెప్పలేము. ఏక కర్తృకములు అసలేకావు. జానపదుల సృష్టి ఎక్కువగా వీటిలో ఉందనవచ్చు. వారు వారికి పరిచయమైన పరిమితమైన అనుభూతులను పొడుపు కథలుగా మలచినారు. సంఘంలోని బాంధవ్యాలు, కొన్ని వృత్తులలో వాడే పరికరాలు, కొన్ని విచిత్రమైన ఊహాలు జన సన్నిహితమైన భాషలో శైలిలో సుకుమారంగా సుతారంగా చెప్పడం జానపద సాహిత్యంలోని పొడుపు కథలలో సర్వత్ర కనిపిస్తుంది. వీటిలో అనల్పమయిన కవితాశిల్పం కూడా ఉంది.

పచ్చ పచ్చని తల్లి
పసిడి పిల్లల తల్లి
తల్లిని చీల్చితే
తియ్యని పిల్లలు

పనసపండులో తల్లి పిల్లలను చూడగలిగిన మధురహృదయం ఈ పొడుపు కథలో ఉంది. ఇంతకు మించిన కవితాశిల్పం ఎక్కడ ఉంది? సరస రస హృదయం ఈ భావనలో లేదనగలమా?

"తోక లేని పిట్ట తొంభై ఆమడలు పోతుంది." ఇది మరో పొడుపు కథ. ఈ రకం పొడుపు కథలు చాలా ఉన్నాయి. పొడుపు కథలకు అపార్థ కల్పన ఒకముఖ్య లక్షణంగా కనిపిస్తూ ఉంది. దానిలో భావస్ఫూర్తి ఉంటూనే ఉంటుంది. పిట్ట అని చెప్పటంతో పూర్వం మనవాళ్ళు పావురాలద్వారా ఉత్తరాలు పంపే పద్ధతి స్ఫురిస్తుంది. పావురంపిట్ట నాటి ఉత్తరం పిట్టకదా? కాని దానికి తోక ఉంది. మరి తోకలేనిపిట్ట అనటంతో నేటి ఉత్తరం స్ఫురిస్తుంది. ఈ పొడుపుకథ నాటి నేటి నాగరకతలను ప్రతిబింబిస్తూంది అనటం సబబు.

ఇంతవరకు అనేకులు అనేక సాహిత్య ప్రక్రియలకు లక్షణాలు నిర్వచించారు. కొందరు నాటకాలకు లక్షణాలు చెప్పేరు. మరికొందరు కావ్యాలకు లక్షణాలు వివరించారు. ఇంక కొందరు నవలలకు, కథలకు, కథానికలకు లక్షణాలు నిర్దేశించారు. జానపద సాహిత్యంలోని యక్షగానాదులకు లక్షణాలు వెల్లడించారు. కాని పొడుపు కథలకు లక్షణాలు ఇదమిత్థంగా ఎవ్వరూ నిర్వచించినట్లు కనిపించదు. కొంత పరిశీలన చేస్తే పొడుపు కథలకు లక్షణాలు ఇవి అంటే బాగుంటుందనిపిస్తుంది.

*పొడుపు కథల లక్షణాలు :*

1. సంక్షిప్తత. కొండంతభావాన్ని కొద్ది మాటలలో అందించడం దీని ముఖ్యలక్షణం.
2. నిగూఢత్వం. స్వరూపనిగూఢత్వం ఉంటుంది. అది అర్థస్వరూపం, భావస్వరూపం, విషయస్వరూపం, పదస్వరూపం, పదార్థస్వరూపం కావచ్చు. ఏదైనా స్వరూప నిగూఢత్వం ముఖ్యం.
3. అపార్థకల్పన. వేరొకటి అయి ఉంటుందేమో అని భ్రమ కల్పించే అపార్థ కల్పన తప్పక ఉంటుంది.
4. వినోదాత్మకమైన క్రీడారూపంగా ఉంటుంది.
5. రేఖామాత్రమైన భావస్ఫురణ ఉంటుంది.
6. రసస్ఫూర్తి కూడా ఉంటుంది.
7. సమస్యగా భాసించి పరిష్కారాన్ని కోరుతుంది.

   ఇందులో కొన్ని లక్షణాలు మాత్రమే ఉంటే వాటిని పూర్తిగా పొడుపు కథలు అనలేము. వాటిని పొడుపు కథల ఛాయలున్న వాటిగా మాత్రమే చెప్పాలి.

విడుపు కథలు

అందరికి ఒకే కొడుకు, ఒకే కూతురు 7

అందరికీ ముఖం చూపుతాను, కాని నీవు గోకు
వాళ్ళతో విరోధం 8

అంబుకు చెంబు, చెంబులో చారెడు నీళ్ళు 9

అంబులో పుట్టింది, జంబులో పెరిగింది.
అక చేతి కొచ్చింది, అంతరించి పోయింది 10

అంభాల మీద కుంభాలు, కుంభాల మీద కుడిత్తొట్టి
కుడిత్తొట్టి మీద గుండ్రాయి, గుండ్రాయి మీద కోరింత
కోరింత మీద ఆరిక అవురూ, ఆరిక అవురు గడ్డిలో
ఆవులు వేయీ 11

అక్క ఇంటిలో దీపంపెడితే, చెల్లెలింటిలో
వెలుతురొస్తుంది (పొగవేస్తుంది) 12

అక్కడక్కడి బండి, అంతరాల బండి
మద్దూరు సంతలో మాయమైన బండి 13

అక్కడకు పచ్చ పచ్చని చిలుక లొచ్చాయి
కొంటారు తింటారు, అంగడిలో అమ్ముతారు 14

---

7. పెండ్లికొడుకు, పెండ్లికూతురు 8. అద్దం 9. కొబ్బరికాయ
10. పేను 11. కాళ్లు, పిరుదలు, కడుపు, తల, కండ్లు,
వెండ్రుకలు, పేలు 12. పేడ పొయ్యి 13. సూర్యుడు
14. అనాసపండు

అక్క యింటికి చెల్లిపోతుంది, కాని చెల్లె లింటికి రాదు 15

అక్కా చెల్లెల అనుబంధం, ఇరుగూ పొరుగూ
సంబంధం, దగ్గర దగ్గర ఉన్నారు, దరికి
చేరలేకున్నారు 16

అక్కా చెల్లెళ్ళు ఏడుస్తారు, అయితే దగ్గర చేరలేరు 17

అగ్గిమీద గుగ్గిలం, అటూ యిటూ అరక్షణం 18

అటూ ఇటూ ముళ్ళకంచెలు, మధ్యన రోడ్డు 19

అగ్గి అగ్గిఛాయ, అమ్మ కుంకుమ ఛాయ, బొగ్గు
బొగ్గుఛాయ—పోలిఛాయ, కందిపప్పు ఛాయ, కాలనేమి
ఛాయ, కడసారి తాతయ్య కణితి ఛాయ 20

ఆడకర్రావు ఈడ కర్రావు, నీళ్ళజూచి నిలుచు కర్రావు 21

అడవిలో అక్కమ్మ ఆసు బోసింది 22

అడవి మ్రాను నరికేసి, సముద్ర పొడ్డున యాతం వేసి
నెల్లూరుకు చీటీవ్రాసి, చరచరా నడుస్తాడు ధర్మరాజు 23

అడివిలో చెట్టుని ఒక అక్షరం, ఊళ్లో ఇల్లుకు అదే
అక్షరం ఒక వారానికదే అక్షరం 24

---

15. పెద్దగిన్నె, చిన్నగిన్నె 16. కళ్ళు 17. కళ్ళు
18. అప్పడం 19. పాపిడి 20. గురిగింజ 21. చెప్పులు
22. సాలెవాడు 23. పడవ 24. మంగచెట్టు, మంగలిల్లు, మంగళవారం

అడవిలో పుట్టింది, అడవిలో పెరిగింది
పాడు పాములు వచ్చి, పైన పడ్డాయి
రాజు ఇంటి కొచ్చింది, రాజుపై కెక్కింది
చెంబులో నీళ్ళన్ని, చెడతాగి పోయింది
చెప్పితే నీనోరు, గప్పు మంటుంది
తప్పితే నీ నోరు, చప్ప గుంటుంది 25

అడవిలో పుట్టింది, అడవిలో పెరిగింది,
మా ఇంటి కొచ్చింది, తాడేసి కట్టింది
తైతక్కలాడింది, కడవలో దూకింది
గుజ్జుమన్నాది, పెరుగులో మునిగింది
వెన్నింత తెచ్చింది, నాకింత పెట్టింది 26

అడవిలో పుట్టింది, అడవిలో పెరిగింది
మా యింటి కొచ్చింది, మహాలక్ష్మి లాగుంది
(తైతక్క లాడింది) 27

అడవిలో సీతమ్మ ముగ్గు వేస్తుంది 28

అడ్డంకోస్తే చక్రం, నిలువుకోస్తే శంఖం 29

అడ్డగోడమీద బుడ్డిచెంబు 30

---

25. గంధపుచెక్క 26 కవ్వం 27 గడప 28 చీమలబారు
29 ఉల్లిగడ్డ 30 ఎద్దుమూపురం

అడ్డగోడమీద ముద్దపప్పు, అటుతోసినా ఇటుతోసినా
పడదు 31

అత్త కాయ, మామ కాయ, నా కాయ నీ కాయ 32

అత్తా మేనత్తా నువ్వొస్తే నేనొస్తా 33

అద్దంకి చెరువులో, ముద్దంకి పిట్ట ముక్కున బంగారం
పెట్టుకొని తోకతో నీళ్ళు తాగుతుంది 34

అనంతపురంలో తప్పెట కొడితే, అంతకు తగులు,
ఇంతకు తగులు, చెరువులో ఉండే చేపకు తగులు,
గాళ్ళల్లో ఉండే గొడ్డుకు తగులు బాలింతకు తగులు 35

అన్నంతిని గోడకు చేరబడుతుంది 36

అన్నికాయలకంటె పెద్దకాయను నేను
మనిషి ఆలోచనకు మూలం నేను 37

అప్పడం గిప్పడం, నా అత్తగారి కొప్పులో కోతిపిల్ల 38

అమరా దేశంనుండి కొమరా పండ్లు వస్తే
కొన్నేవాళ్ళేగాని, తినేవారు లేరు 39

అమ్మ కడుపున పడ్డాను, అంతా సుఖాన ఉన్నాను
నీచే దెబ్బలు తిన్నాను, నిలువున ఎండి పోయాను
నిప్పుల గుండు తొక్కాను, గుప్పెడు బూడిద
అయినాను 40

---

31 ఎద్దుపెండు (మూత్రం) 32 అత్తికాయ, మామిడికాయ, నిమ్మకాయ, నారదబ్బకాయ 33 తాళం చెవి 34 దీపం 35 పసుపు 36 పళ్ళెం 37 తలకాయ 38 పనసం 39 పగడాలు 40 పిడక

అమ్మా అంటే కదులుతాయి, నాన్నా అంటే కదలవు — 41

అమ్మ పెట్టే అట్లు, కొంటె అబ్బాయికి అవసరం — 42

అమ్మా యొకతె వచ్చింది, అమృతం నిండా పోసింది
కులుకుతు కులుకుతు నడిచింది, కౌగిలిలో అట్టే
కరిగింది — 43

అయ్య కొయ్యలమారి, అమ్మ గిచ్చులమారి, బిడ్డలు
రత్నమాణిక్యాలు — 44

అరంకణం గదిలో, అరవై మంది నివాసం — 45

అరకట్టు మరకట్టు, మరకు ముప్పై కట్లు — 46

అరచిన అరచును, మారు మాటాడదు — 47

అరచేతిలో అద్దం, అనంతరూప లక్ష్మీకాంతం
లక్ష్మీకాంతం యిచ్చిన వారికి, లక్షవరహాలు — 48

అరచేతి పట్నాన అరవై రంధ్రాలు — 49

అరచేతిలో అరవై తూట్లు — 50

అరచేతిలో కుంకుమ, అందమైన కుంకుమ
పేరాకు కుంకుమ, బిగువైన కుంకుమ — 51

---

41 పెదవులు  42 చీవాట్లు  43 నీళ్ళ బిందె  44. రేగుచెట్టు
45. అగ్గిపెట్టె  46. రథం  47. ప్రతిధ్వని  48. తాళి  49. జల్లెడ
50. జల్లెడ  51. గోరింటాకు

అరచేయంత పట్నానికి, అరవై ఆరు దిడ్లు
దిడ్డికో సిపాయి, సిపాయికి గంపెడు ఆముదం 52

అరచేయంత మడుగు, దాని నిండా నీరు
నీటిలో కాడ, కాడచివర పువ్వు 53

అరచేయంత పట్నం, అరవై మేడల పట్నం
మేడ మేడకు ముప్పయి గదులూ, గది గదికి పదేసి
బంట్లూ బంటు బంటూకు బందూక్, చూస్తే భయమెచ్చు
మెచ్చువచ్చు ఆ పోరూ, మెలకా చెప్పే ఎవరో! 54

అరవై బారల చీర, ఇరవై మూరల రెవికగల స్త్రీమూర్తి
ఎవరు? 55

ఆకాశ గడలు పాతినారు, అందు ముగ్గురు ఎక్కినారు
కోటి పురుగుల్ని చంపినారు, కుండలతో రక్తాన్ని
పట్టారు 56

ఆకాశ గిరగిర, నేలకి థాం
రాతికి రంగం, నోటికి సైతాన్ 57

ఆకాశమంతా అల్లుకురాగా, అడ్డెడుబియ్యం చల్లుకురాగా
కడివెడు నీళ్ళు కారుకురాగా, చాటెడు చెక్కలు
చెక్కుకు రాగా అందులో ఒకరాజు అల్లాడాడు 58

---

52. తేనెపట్టు 53. వత్తి, దీపం 54. తేనెపట్టు
55. ప్రకృతి మాత 56. గానుగ 57. కొబ్బరికాయ 58. గానుగ

ఆకాశాన అరవై ఆరు మసి బొగ్గులు వేలాడు
తున్నాయి 59

ఆకాశాన అప్పన్న, నేలకుప్పన్న, బోడినాగన్న,
పిండి పిసుకన్న 60

ఆకాశాన అంగ వస్త్రాలు, చక్కంగ అరవేశారు 61

ఆకాశాన అరవై ఆరు కొడవళ్ళు 62

ఆకాశము పచ్చన, నక్షత్రాలు తెల్లన 63

ఆకాశములో అంబు, అందులో చెంబు
చెంబులో చారెడు నీళ్ళు 64

ఆకు అంగుళం, కాయ మూరెడు 65

ఆకుగాని ఆకు 66

ఆకు పచ్చ, కాయ వగరు, పండితే తీపి 67

ఆకుపచ్చ వేషంలో, మేడపై కొస్తాడు
అరుణ వేషంలో, క్రిందికి దిగొస్తాడు 68

ఆకులేని అడవిలో, జీవం లేని జంతువు
జీవమున్న జంతువును వేటాడింది 69

---

59. నేరేడు పళ్ళు 60. వెలగ పండు 61. అరిటాకు
62. చింతకాయలు 63. పచ్చిమిరపకాయ 64. టెంకాయ
65. ములగకాయ 66. వక్కాకు 67. అరటిపండు
68. మిరపకాయ 69. దువ్వెన

ఆకులేని అడవిలో, తోకలేని మృగము
తోకలేని మృగము కడుపున, ఈకలేని పక్షి పుట్టింది 70

ఆకువేసి అన్నం పెడితే, ఆకుతీసి అన్నం తిన్నాడు 71

ఆడ గణ గణ, ఈడ గణ గణ
మద్దెమ్మ గుడికాడ, మరీ గణ గణ 72

ఆడదగులు ఈడ దగులు, చెర్లో చాపకు దగులు
పడతి చెంపకు దగులు 73

ఆదోని అరటాకులు, గుత్తి ముత్యాల గుత్తులు
బళ్ళారి బాణాకట్టి 74

ఆ బాబు ఈ బాబు పోట్లాడితే
అల్లా సాహెబు వచ్చి తగవు విడిపించాడు 75

ఆడ పళ పళ ఈడ ఫళ ఫళ
మద్దమ్మ గుడిలో మరీ ఫళ ఫళ

ఆమడదూరంనుండి అల్లుడువస్తే, మంచం క్రింద ఇద్దరు
గోడ మూల ఒకరు దాగుంటారు 76

ఆ రాజు కూతురు, అధిక చక్కనిదట
గోరంత కొప్పు పెట్టి, గొలుసులు దిగవేసిందట 77

---

70. ?  71. పులిహోరలో కరివేపాకు  72. మద్దెల, డోలు
73. పసుపుకొమ్ము  74. జొన్నపైరు  75. తాళం చెవి
76. చెప్పులజోడు, చేతికర్ర  77. వరి వెన్ను

ఆలమూరు చెరువులో హంస, దాని కాళ్ళు కురచ 78

ఆవిరిచేత గంటకు ఐదామడలు వెళ్తుంది 79

ఆ వీధి రాజులకు కొప్పుంది, కాని జుట్టులేదు
కళ్ళున్నాయికాని చూపులేదు 80

ఆ వూరు దుబ్బులో ఆవులు మేస్తున్నాయి 81

ఇంటికి కన్ను, కంటికి కన్ను
మింటికి కన్ను. ఇల్లంతా వెలుగు నిచ్చు 82

ఇంటి వెనుక ఇంగువచెట్టు, ఎంతకోసినా గుప్పెడు కాదు 83

ఇంటి వెనుక గోడమీద ఐదేళ్ళవాడు కూర్చున్నాడు 84

ఇంటి వెనుక కుప్పవేసి కుప్పకు నిప్పుపెట్టి
కుప్పకాలి పోతేను అప్పులెల్ల తీరిపోయె
తాన తందాన తాన తక్కతైతాని తందానతాన
ఎంతచెప్పిన వేదశాస్త్రం తెలియదాయె దాని భావం
దాని భావం బట్ట బయలు దాసి పేరే... 85

ఇంటి వెనకాల దాక దేకలాడు చున్నది 86

ఇంటి వెనకాల ఏనుగు పడ్డది, ఎంతమంది లేపినా
లేవదు 87

---

78. తమలపాకు 79. రైలు 80. కొబ్బరికాయ 81. పేలు
82. దీపం 83. పొగ 84. పిడక 85. కుమ్మరిఆవం
86. తాబేలు 87. పేడకుప్ప

ఇంటిలోనికి పోవునపుడు, దొంగలు అయిదు మంది
వెలుపలికి వచ్చేటప్పుడు, పదైదు మంది 88
ఇంట్లో మూలన మూలన కూర్చుంటుంది, ఎండకు
వానకు బయటకు బయలు దేరుతుంది 89
ఇంత పిల్లలేదు, ఇల్లంతా గుల్లచేసింది 90
ఇంత ముండ, ఎంత బరువన్నా మోస్తుంది 91
ఇంత ముండలేదు, ఇల్లెక్క పెండె కొడుతుంది 92
ఇంతంత గుడికాయ ఈ చుట్టూ గుడికాయ
చింతల్ల తోపులో బొంత మామిడి కాయ
ఏమిచ్చి కొనగలరు వెలమదొరలు 93
ఇంతి ఇంటాయన అనుకొని, తడబడి గుండెరాయి
చేసుకుంది 94
ఇంతింత గుడికాదు, ఈశ్వరుని గుడికాదు
కంచు గోపురం కాదు, అది కదలదు మెదలదు 95
ఇంతింతాకు, బ్రహ్మంతాకు, ఇరిస్తే పెళ పెళ 96
ఇంతింత గుడికాదు, ఈశ్వరుని గుడికాదు
కంచు కొప్పెర కాదు, కదిలించగా రాదు 97

---

88. ఎంద్రకాయ వేళ్ళు పడి, కలుగులో చేయి పోనిచ్చి పట్టేటప్పుడు పదైదు 89. డబ్బా 90. చెదపురుగు 91. పొయ్యి
92. నుసిపురుగు 93. చందమామ 94. అహల్య
95. ఆకాశం 96. ఈర్పెన 97. ఎండ

ఇక ఇక కాయ, పక పక కాయ, జరజ్యోతికాయ
కాయకిలు, మంది కాయ 98

ఇక ఇక కాయ, పక పక కాయ
వేల పోయేకాయ, నెత్తి కెక్కేకాయ 99

ఇక్కడ అక్కడ ఉంటుంది, కబుర్లు అందిస్తుంది 100

ఇక్కడ ఉండే బండీ, ఎంతలో పోయేరండి
మల్లె మొగ్గల బండి, మాసింది రండి 101

ఇక్కడ కట్టిన కట్లు, ఇనుప కట్లు
మావూరి చెరువులో, మాయమై పోవు 102

ఇక్కడ నుంచి చూస్తే గుండు, అక్కడికి పోతే చెండు
దాన్ని తంతే పదహారు అవుతాయి. 103

ఇక్కడ పొడిచిన బండి, ఇనప తోటలో బండి
మావూరు తోటలో మాయమై పోయె 104

ఇగములు జగములు పుట్టకముందు
విఘ్నేశ్వర పట్నం కట్టక ముందు
పరలోకాలనుండి నాలుగు పలకల దూలం వచ్చింది 105

ఇటుకొండ అటుకొండ, నడుమ నాగులకొండ
కొండలో నున్నాడు కొండ నాగప్ప 106

---

98. ప్రత్తికాయ 99. ఊతకాయ, ప్రత్తికాయ, ఆముదంకాయ ఎంద్రకాయ 100. టెలిఫోన్ 101. ఎండ 102. చద్దిమూట 103. కెల్లగడ్డ 104. సూర్యుడు 105. ? 106. కొండ

ఇరికిరికి మాను క్రింద, ఇరి పోతు చావంగ
పొట్టి చినంగ, వాసన రాంగ 107

ఇరుకు దొడ్డిలో నూరుగురు దాక్కున్నారు 108

ఇల్లంతా తిరిగి పోయంలేక మూల నక్కింది 109

ఇల్లుంది కాని తలుపు లేదు, మనిషి ఉన్నాడు కాని
మాటలేదు 110

ఇల్లుండగా ఇడుపుండగా, వీధిలో కొచ్చి కూర్చుండు 111
ఇల్లు కాని ఇల్లు 112
ఇసుకలో ఇల్లు వేసి, ఈశ్వరుని పూజించి
దంతాన తలుపు వేసి తను పోయి సింహం మీద
కూర్చుండు 113

ఇసుకలోని పసిరికా, రాజు రమ్మన్నాడే
ప్రధాని పొమ్మన్నాడంటే విశాల వర్షం కురిసే
సేదకో వచ్చే వీల్లేదు పొమ్మంది 114
ఇసుకలో ఇల్లుకట్టి, దంతాన తలుపుతీసి దబాన
వద్రంగి చెరువుకు నీళ్ళ కెళ్ళింది 115

---

107. మొగలిపువ్వు 108. నువ్వుకాయ 109. చీపురు 110. గోరీ
111. ఎద్దుల బండి 112. బొమ్మరిల్లు 113. రోజాపువ్వు
114. ఎంద్రకాయ 115. మొగలి పువ్వు

ఈడ ఢమ ఢమ, ఆడ ఢమ ఢమ
మద్దిరేవులకాడ మరీ ఢమ ఢమ 116

ఈనదు పొర్లదు, బంధం వేస్తే, పది బిందెల పాలిస్తుంది 117

ఉక్కు కోర్వలేక, చెక్కిళ్ళు చెమటూర
ముక్కులేని పండు చెక్కుదీసి
చెక్కలకోసెడి, ఒక్కపిల్లవాడు మెక్కినాడు 118

ఉదయం నాలుగు కాళ్ళతో నడిచేది
మధ్యాహ్నం రెండు కాళ్ళతో నడిచేది
సాయంత్రం మూడు కాళ్ళతో నడిచేది 119

ఉదయగిరి చెరువులో ఉర్లొస్తుంది
పొదిలి చెరువులో పొర్లొస్తుంది
అందులో ఒకభామ ఆడుతూ ఉంది 120

ఉన్నచోట ఉండి పదుల దాటింతురు
పయనమైన అపుడే పయన ముగుదురు
నాకు కాళ్ళు రెండు, తమరి కాళ్ళు రెండు 121

డబ్బు డబ్బున వాన కురిసె, గొయ్యినిండా కుప్పలేలే
కుప్పకాలి అప్పతీరె 122

---

116. ఉరుము 117. తాటిచెట్టు 118. అనాస 119. పసితనం నాలుగు కాళ్ళు - పెద్దయిన తర్వాత రెండు కాళ్ళు వృద్ధాప్యంలో మూడు కాళ్ళు 120. కవ్వం 121. నిచ్చెన 122. కుమ్మరిఆవం

ఊరంత కలిసి చిప్పెడు గుగ్గిళ్ళు తినలేరు 123

ఊరంతా తిరిగి మూల కూచుంది 124

ఉరుములు మెరుపులు ఉచ్చిత పండు, తొంబై తిన్నా

తొడిమలు లేవు 125

ఉరుములు మెరుపులు, ఉటంగి జాణలు

కదలక మెదలక పొదలో గ్రుడ్లు పెట్టె 126

ఊరిలో కలి, ఇంటిలో కలి, వంటిలో కలి 127

ఊదూరవతల, ఉత్తరాదవతల

జమ్మి చెట్టవతల, జాలారవతల

పిలజులేని పిట్ట, గుడ్లు పెట్టింది 128

ఊళ్ళో హుసేనుగాడు, అడవిలో అనుగాడు

డొంకలో డోలుగాడు 129

ఎంగిలి వచ్చి వెన్నుమీద పడింది 130

ఎండకు ఎండాని పువ్వు, వానకు తడవని సుందారి పువ్వు

అదిలేక గడవదు సుందారి పువ్వు 131

---

123. వడగళ్ళు 124. చీపిరి 125. దోసెలు 126. కుక్కగొడుగు 127. చాకలి, రోకలి, అకలి 128. పుట్ట కొక్కులు 129. కుక్క 130. చాకలి మూట 131. రూపాయి బిళ్ళ

ఎంత మూసినా చప్పుడు కావు 132

ఎండిన దొకటి, పండిన దొకటి
కాలిన దొకటి, ఈ మూడు ఇంటికి అలంకారం 133

ఎక్కడైనను అంతను తిరుగు చుండు, పలికిన పలుకదు
నవ్విన నవ్వును, భయపడిన భయపెట్టు 134

ఎక్కలేని చెట్టుకు గంపెడు కాయలు 135

ఎగిరిన ఎగురును, పోయిన పోవును
నడచిన నడచును, నోట మాట లేదు 136

ఎగువో పలకా దిగువో పలకా, పలకల క్రింద మెలికల
పాము, పామును పట్టా పగ్గం లేమా, పగ్గెలు పలికే
సిగ్గోదినా 137

ఎనిమిది చేతుల ఏబ్రాసి, ఎపుడు తిరిగే సోబ్రాసి
వెన్నున జందెం వేళ్ళాడుతూ, తీసిన కొద్దీ తేర్లాడు 138

ఎనిమిది కాళ్ళు నాలుగు కొమ్ములు, అడ్డంగా నడచును
అసుర కాదు, శిరసు తోకలేదు, జీవం మాత్రం ఉంది 139

---

132. కనురెప్పలు 133. తాంబూలం 134. నీడ
135. మిరప చెట్టు 136. నీడ 137. నాలుక 138. రాట్నం
139. సీత